# "ప్రాయశ్చిత్త ప్రశ్ననిర్ణయము."

శ్రీమత్పరమహంస పరివ్రాజ కాచార్య వర్యేత్యాది సకల
బిరుదావళీ విరాజమాన శ్రీశృంగేరీ విరూపాక్ష పీఠ
బాలస్వాములు శ్రీ కల్యాణానంద భారతీ స్వాము
ల వారిచే రచియింప బడినది.







బెజవాడ మారుతి ముద్రాక్షరశాల యందు
గుంపెని హనుమంతరావుచే
ముద్రింపఁబడినది.

1918.

ఓం.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షి భూతం।
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుంతం నమామి॥

—(o)—

# "ప్రాయశ్చిత్త పశు నిర్ణయము."

శ్రీ మత్పరమ హంస పరివ్రాజ కాచార్య వర్యేత్యాది సకల
బిరుదావళీ విరాజమాన శ్రీ శృంగేరీ విద్యాపీఠ
బాలస్వాములు శ్రీ కల్యాణానంద భారతీ స్వాము
ల వారిచే రచియింప బడినది.

—:o:—

బెజవాడ మారుతి ముద్రాక్షరశాల యందు
గుంపెని హనుమంతరావు చే
ముద్రింపఁబడినది.

1918.

ఓం.

# ప్రాయశ్చిత్త పశు నిర్ణయము.

సోమపానము చేయుటయందు పాలంభము చేయబడు ప్రాయశ్చిత్త పశువులను గూర్చి విప్రతిపత్తియుండుటచే నీసిద్ధాంతమును శ్రుతి యుక్త్యనుభవసమ్మతముగ నిరూపించుచున్నారము.

అగ్నిష్టోమమునకు అగ్నీషోమీయము సవనీయమను రెండు పశువులు ప్రధాన యాగముతో సంబంధించి యుండుటచే శాస్త్ర విహితములై యున్నవి. ఇందు విప్రతిపత్తికి నవకాశ మెంతమాత్రమును లేదు. విప్రతిపత్తి యెందన సోమయాగము చేయదలంచిన వాని యందలి యధికార వైగుణ్యముచే విధింపబడిన ప్రాయశ్చిత్త పశువులందు. అదెట్లనిన సోమయాగము చేయదలంచిన వానియొక్క తండ్రి తాత ముత్తాతలలో గాని తండ్రి తాతలలో గాని యెవ్వరైన నొకరు సోమయాగము చేయనిచో నట్టివాని సోమయాగమున నైంద్రాగ్నము ఆశ్వినమను రెండు పశువులు ప్రాయశ్చిత్తార్థము పాలంభము చేయబడు వాడుకయే కారణము చేతనో యంధపరంపరగా ప్రసరించి నేటికి పాదుకొని యున్నది. ఇయ్యది శాస్త్రయుక్త్యనుభవ విరుద్ధమగుటంజేసి యందలి దోషముల విమర్శింపుచు సిద్ధాంతమును వ్యక్తీకరింపుచున్నారము

తృతీయపురుష పర్యంతము సోమయాగము లోపించిన వాడైంద్రాగ్నమును పాలంభము చేయవలయు ననుటకు గల శ్రుతి ప్రమాణము. "ఐంద్రాగ్నంపు నరుత్సృష్ట మాలభేతయ ఆతృతీ యాత్పురుషాత్సోమం నపిబే ద్విచ్ఛిన్నోవా ఏతస్య సోమపీధో యోబ్రాహ్మణస్సన్ తృతీయాత్పురుషాత్సోమం నపిబతీంద్రాగ్నీ ఏవస్వేన భాగధేయేనోపధావతి తావే వాస్మై సోమపీధం ప్రయచ్ఛతః ఉపైనగ్ సోమపీథోనమతిం"

## —। పై శ్రుతికి విద్యారణ్య భాష్యము. ।—

విచ్ఛిన్న సోమపీథస్య పశుంవిధత్తే । గాలితవృషణో బలీవర్దః

త్సృష్ట ఇత్యుచ్యతే । స్వపోషిణో లాంగలవహనాదేర్యుక్తః పునరుత్సృష్టః । స్వాత్మన మారభ్య తృతీయః పురుషః పితామహః పితాస్వయంచ యదా సోమం నపిబేయుః తదానీ మేతస్యత్రయస్య సోమపానం విచ్ఛిన్నం సపీతం పశుమాలభేత.

పై శ్రుతికి ఆపస్తంబసూత్ర వ్యాఖ్యాతయగు భట్టరుద్ర దత్తులిట్లు వ్యాఖ్యానమును వ్రాసియున్నారు:— "తత్ర త్రయః ప్రాంచస్త్రయః ప్రత్యంచ ఇత్యాదౌ ప్రాక్త్వేనోక్తా దీక్షావేదన నామ సుబ్రహ్మణ్యాదౌ నామభిః కీర్త్యమానాః పిత్రాదీనాం త్రిపూరుషీ । తస్యాం చరమః ప్రపితామహః తృతీయోఽభిప్రేతః నత్వాత్మన స్తృతీయః పితామహః । యతః సోమపానోద్యత స్యాత్మన స్తద్విచ్ఛేదాభావాత్ ఏతత్తేత తయేచ త్వా నసన్నేత్తే పితామహ ప్రపితామహ యేచత్వా మన్వితి తిసృషు ప్రసక్తిషు విదధాతి తస్మాదా తృతీయాత్పురుషాన్నామ నగృహ్ణాంతీ త్యాదౌ స్వక్తౌఘణత్వాచ్చ । తథా విధ్యర్థత్వ మప్యతి ఏవ నిదర్శనా దవగంతవ్యం । తదయమర్థో భవతి । యస్య పిత్రాదయస్త్రయః పురుషాః న సోమం పీతవంతః స సోమపీథార్థీ పశుమాలభేతేతి । కాత్యాయన మతాత్తు ద్విపురుష విచ్ఛిత్తావపీష్యతే యథాహ ! వసంతేగ్నిష్టోమః ఐంద్రాగ్నం పునరుత్సృష్టమాలభ్యేద్ద్వి పురుషాసోమ పీథేన ఇతి । కః పునరుత్సృష్టః ఛాగః పునరుత్సృష్ట ఇతి భారద్వాజః । బౌధాయన స్త్వాహ । పునరుత్సృష్టోఽనడ్వాన్ ఇత్యవశీర్ణగవ ఏష ఉక్తో భవతి లింగం చాత్ర భవతి । పునరుత్సృష్ట ఇవహ్యేతస్య సోమపీథ ఇతి॥"

పై శ్రుతి వ్యాఖ్యానముల వలన విచ్ఛిన్న సోమపీథ సంధానార్థ మైంద్రాగ్న పశువును ఆలంభము చేయవలయునని తేట తెల్లమగుచున్నది. పునరుత్సృష్టపన జవసత్త్వములు డిగినయెద్దని బోధాయన విద్యారణ్యులు దలంచుచున్నారలు ఛాగమని భారద్వాజులు దలంచుచున్నారలు ఐనను జైమిని అ ౧౦ పా ౨ అ ౩౦. అగు సాధారణ గుణవచనములగు శ్వేతాది శబ్దాధికరణ న్యాయముచే పునరుత్సృష్టము ఛాగమని శిష్టులు వ్యవహరింపుచున్నారలు.

ఇది యిట్లుండ సోమపానేచ్ఛయందు శ్రుత్యంతరముచే ప్రాయశ్చిత్తాంతరము విధింపబడుచున్నది. అది యెట్లనిన:—

"ఆశ్వినం ధూమ్రలలామమాలభేత । యో దుర్బ్రాహ్మణః సోమం పిపాసేదితి."

## పై శ్రుతికి విద్యారణ్య భాష్యము.

దుర్బ్రాహ్మణస్య సోమపానేచ్ఛాం నిమిత్తీకృత్య పశుం విధత్తే । మలినశ్వేతత్వం ధూమ్రత్వం । లలాటే శౌక్ల్యేనలాంఛితోఽవశిష్టశరీర ధూమ్రవర్ణః పశురశ్వినోః ప్రియః । దుర్బ్రాహ్మణ లక్షణం బోధాయనేనోక్తం । యస్య వేదశ్చ వేదీచవిచ్ఛిద్యేతే త్రిపూరుషం స వై దుర్బ్రాహ్మణో నామ యశ్చైవ వృషలీపతిః । పూర్వోక్త పునరుత్సృష్ట శౌయో బ్రాహ్మణస్స్నా తృతీయా దిత్యుక్తత్వాదిద్విశో దుర్బ్రాహ్మణో నాధికారీ । అత్రతు సోమపానే శ్రద్ధాళుత్వే నేచ్ఛావత్వే సతి దుర్బ్రాహ్మణోఽధిక్రియతే॥"

పై శ్రుతికి భట్టభాస్కరదత్తులిట్లు వ్యాఖ్యానమును వ్రాసియున్నారు: "కోసౌ దుర్బ్రాహ్మణః । తమాహ బౌధాయనః । యస్య వేదశ్చ వేదీచవిచ్ఛిద్యేతే త్రిపూరుషం । సవై దుర్బ్రాహ్మణో నామయశ్చ పౌనర్భవో భవేదితి । తత్ర వేదశ్చ వేదీచేతి చకారాభ్యాం వ్యక్తమ్ సముచ్చయా వగమాదుభయవిచ్ఛేద ఏవ భవత్యాశ్వినో నాన్యతరస్య విచ్ఛేదే । భారద్వాజస్త్వాహ । విలుప్త సావిత్రీకో దుర్బ్రాహ్మణ ఇతి । తస్మిన్ స్తు సత్త్రి పురుషముభయ విచ్ఛేదే పి భవత్యేవాశ్వినః । ఐంద్రాగ్నస్తు నేష్యతే । నిమిత్తా భావాత్॥"

పై శ్రుతి వ్యాఖ్యానముల వలన దుర్బ్రాహ్మణుడు సోమపానము చేయ దలంచినచో ఆశ్విన పశువును పాలంభము చేయవలయునని స్పష్టమగుచున్నది. దుర్బ్రాహ్మణుడనినచో త్రిపురుషముగా వేద వేదులు లోపించినవాడు, వృషలీపతి, పౌనర్భవుడు, సావిత్రి పుష్కలముగా లోపించిన వాడును. అని నిరూపింప బడియున్నవి. వీరలు సర్వకర్మ బహిష్కృతులని స్మృతులు వక్కాణింపుచున్నవి. ఇట్టి సర్వకర్మ బహిష్కృతులకు శ్రద్ధచే సోమపానేచ్ఛ జనించెకేని ఆశ్విన పశువును పాలంభము చేయవలయుననియు ఐంద్రాగ్నముతో నవసరముగాని యధికారముగాని లేదనియు తేట తెల్లమగుచున్నది.

పై రెండు శ్రుతులను వాటి వ్యాఖ్యానములను బరిశీలించి చూచిన

తేలిన సారాంశ మెట్టిదనగా:—సోమపానము చేయదలంచిన వారి యందలి వైగుణ్యముచేత తదధికారసిద్ధికై వ్యవస్థిత వికల్పముచే నైంద్రాగ్నాశ్విన పశువులు ప్రాయశ్చిత్త పశువులుగా విధింపబడెనని. అందు బ్రాహ్మణునికి విచ్ఛిన్న సోమపీథ సంధానార్థము ఐంద్రాగ్న పశువు, దుర్బ్రాహ్మణునికి సోమపాన సిద్ధికై యాశ్విన పశువున్ను ప్రాయశ్చిత్తార్థమై విధింపబడి యున్నది గాని రెండు పశువులు నొక్క పురుషుని యందలి వైగుణ్య సమాధానార్థమై యెంత మాత్రము విధింపబడలేదు. ఇది యిట్లుండగ కొందరు దుర్బ్రాహ్మణునియందు దౌర్బ్రాహ్మణ్యము, విచ్ఛిన్న సోమపీథము అను రెండు వైగుణ్యములు సంభవించుననియు నారెండిటి ప్రాయశ్చిత్తార్థము రెండు పశువులను హాలంభము చేయవలయుననియు దలంచుచున్నారలుగాని యది యజ్ఞాన విలసితము. ఈ రెండు పశువులును సోమపానేచ్ఛ యందలి యధికారమునకై వ్యవస్థిత వికల్పముచే విధింపబడినవి గాని దౌర్బ్రాహ్మణ్యనివృత్తికి మాత్రమాశ్వినమనియు విచ్ఛిన్న సోమపీథమునకు మాత్రమైంద్రాగ్నమనియు నిర్వచింపబడి యుండలేదు. అట్లు దలంచినచో “యో దుర్బ్రాహ్మణస్సోమం పిపాసేదితి” యను శ్రుతి వ్యర్థముగా వచ్చును. మరియు సోమపానేచ్ఛయందు విధింపబడినను అదృష్టజనకములగుటచే రెండు పశువులకును సముచ్చయము యుక్తమని యనవచ్చునుగాని యదియును నజ్ఞానవిలసితమే. ఏలనన నీ పశువులు పురుషుని యందలి వైగుణ్య సమాధానార్థమై విధింపబడిన ప్రాయశ్చిత్తములు గాని యదృష్ట జనకము లెంత మాత్రమును గానేరవు. ఇట్టి ప్రాయశ్చిత్తములకు వికల్పమే గాని సముచ్చయ మెంత మాత్రమును గానేరదను రాద్ధాంతము జైమిని అ. ౧౨ పా 3 అ ౫ అధికరణ న్యాయముచే నిర్ణయము చేయబడియున్నది. కొందరు విచ్ఛిన్న సోమపీథునే దుర్బ్రాహ్మణుడని తలంచుచున్నారలు. యిది యసంగతము. విచ్ఛిన్న సోమపీథ మాత్రముచే దుర్బ్రాహ్మణత్వ మెంతమాత్రమును శంకింపబడగూడదు. అట్లు దలంచిన “బ్రాహ్మణస్సన్నా తృతీయాత్” అను శ్రుతివ్యాకోప దోషము గలుగును. అంతియె గాదు సర్వవ్యవహార లోపప్రసంగము గూడవాటిల్లు విచ్ఛిన్న సోమపీథ వైగుణ్యముచే దుర్బ్రాహ్మణత్వము సంక్రమించెనేని లోకములో బ్రాహ్మణులనువారల ప్రసిద్ధము గావచ్చును. దుర్బ్రాహ్మణుడు సర్వకర్మ బహి

ష్కృతుడని స్మృతులు ఘోషింపుచున్నయవి. దానంజేసి యాజన యాజనాది షట్కర్మములకు హానిగలుగు. దానంజేసి లోకమునందు స్వవహార దశయందుండు షట్కర్మ వ్యవహారమంతయు నశాస్త్రీయమేగా వచ్చును. లేదా వేద శాస్త్రములకు గతిలేక నిష్ప్రయోజనములై యుండి నశింపవలసి వచ్చును. దానంజేసియె "వేదశ్చ వేదేచ" యను స్థలమందు "వేద" శబ్దముచే స్మార్తాగ్ని హోత్రము గ్రహింపబడు చున్నయది అట్టి యభిప్రాయముచేతనే "లుప్త సాగ్నికో నబ్రాహ్మణః" అని భారద్వాజులు నిర్వచించియున్నారలు. ఇట్టి యభిప్రాయముచేతనే "నని యతోపాసకస్యదో బ్రాహ్మణ్యమ్" అని ప్రయోగవృత్తికారులు వచించియున్నారలు. ఇట్టి యాశయమే వాహిని పరీయములోను గాగల యాపస్తంబ సూత్రవ్యాఖ్యానములలో గూడ నిర్వచింపబడి యున్నయది. ఇట్లు లెన్నివిధముల పరికించి జూచినను ఆశ్విన పశువు అనూచాన బ్రాహ్మణు విషయమగు ప్రాయశ్చిత్త మెంతమాత్రమును గాసేరదు. కావున విచ్ఛిన్న సోమపీథసంధానార్థమై బ్రాహ్మణులకు నైంద్రాగ్న మొకట్టియె ప్రాయశ్చిత్త పశువుగా నగ్నిషోమీయ పశువుతోను సాలంభము చేయబడవలయు. ఆశ్వినమును గ్రహించుటచే నవి హింసితమగు పశ్వాలంభముచే హింసాప్రయుక్త దోషములు యజమానుని యందును ఋత్విక్కుల యందును సంక్రమించుటయె గాక నశాస్త్రీయ కృత్య మొనరించుటచే కర్మ సంపూర్తియగుటకు మారుగ ననర్థము వాటిల్లును.

కావున "యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః। నస సిద్ధి మవాప్నోతి నసుఖం నపరాంగతిం" అను శ్రీకృష్ణ శాసనమును గుర్తెరింగి శిష్టులును వైదికమార్గ నిరతులును ప్రవర్తకులును ప్రయోగ కుశలులును అంధపరంపరగా వాడుకలోనికి వచ్చిన ఆశ్విన పశువును ప్రాయశ్చిత్త పశువులనుండి విడచి ప్రవర్తింపుదురు గాక. ఒకానొక వేళ యాజకులు నబ్రాహ్మణుని యందలి యనుగ్రహముచే బ్రవర్తించిరేని యాప్వాడాశ్వినమును గ్రహించి యైంద్రాగ్నమునుండి విరమించి ప్రవర్తింపుదురుగాక. ఏవిధమునవైనను ఐంద్రాగ్నాశ్వినములకు సముచ్చయమే తీరునను పొసగదనియు నారెంటికిని సముచ్చయము జేయుటచే శ్రుతిస్మృతులకు వ్యాకోపము గల్గించిన వారలై యిహపరముల రెండింటికిని దూర

మగుదురని గుర్తెరింగి సర్వ జనులును వ్యవహరింపుదురు గాక.

ఇతి నారాయణ స్మృతిః॥

## క్రతువునందలి సంకల్పము.



„విచ్ఛిన్న సోమపీథ సంధానార్థ మైంద్రాగ్నం పశుమగ్నీ షోమీ యేన పశునా సహో పాలంభం కుర్వే సోమేనయక్ష్యే యద్వా॥

దౌర్బ్రాహ్మణ్య నివృత్తిద్వారా సోమపాన సిద్ధ్యర్థ మాశ్వినం పశుమగ్నీ షోమీయేన పశునా సహోపాలంభం కుర్వే సోమేనయక్ష్యే॥

ఇతి నారాయణ స్మృతిః॥



